# జర్నలిస్టుల పదకోశం



సంకలనం, సంపాదకుడు :

**పరకాల సూర్యమోహన్**

# జర్నలిస్టుల పదకోశం

(ఇంగ్లీషు-తెలుగు)

సంకలనం, సంపాదకుడు:

పరకాల సూర్యమోహన్




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్- 500 001.

JOURNALISTULA PADAKOSAM (English - Telugu)
Compiled & Edited by Parakala Suryamohan

ప్రచురణ నెం. : 2254

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : ఏప్రిల్, 2001



వెల: రూ.90-00

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-1-435, విజ్ఞాన్ భవన్, బ్యాంకు స్ట్రీట్,
హైదరాబాదు-500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్
హైదరాబాదు (సుల్తాన్ బజార్, అబిడ్స్),
విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

అక్షరకూర్పు: ట్వంటీఫస్ట్ సెంచరీ, దిల్ సుఖ్ నగర్. ఫోన్: 4066986

ముద్రణ: శ్రీ కళాంజలీ గ్రాఫిక్స్, హైదరాబాదు-29. ఫోన్: 3229831

# అంకితం



మా అమ్మ, నాన్న

శ్రీమతి పరకాల అహల్య,

శ్రీ పరకాల పట్టాభిరామారావు గార్లకు

# ఉపోద్ఘాతం

ఇది జర్నలిస్టుల కోసం రూపొందించిన పదకోశం. మామూలు డిక్షనరీ కాదు. తెలుగు పత్రికల్లో పనిచేసే జర్నలిస్టులు – ముఖ్యంగా జనరల్ డెస్క్‌లో పనిచేసే సబ్–ఎడిటర్లు రకరకాల న్యూస్ ఐటమ్‌లను అనువాదం చేస్తూ వుంటారు. ఆర్థిక, శాస్త్ర, వ్యావసాయిక, సాంకేతిక రంగాలకు సంబంధించిన వార్తలతోబాటు రాజకీయ నాయకుల ప్రసంగపాఠాలు, హైకోర్టు, సుప్రీంకోర్టు ఇచ్చే ముఖ్యమైన తీర్పులు, బడ్జెట్ ప్రసంగాలు, అంతర్జాతీయ సమస్యలపై ప్రపంచాధినేతల ప్రసంగాలు, సంయుక్త ప్రకటనలు మొదలైనవాటిని సబ్–ఎడిటర్లు అనువాదం చేస్తున్నప్పుడు తరచుగా ఇబ్బందిపెట్టే మాటలు, ఫలానా మాటని ఎలా అనువాదం చేస్తే బావుంటుంది అని ఆలోచింపజేసే మాటల్ని మాత్రమే నేను సేకరించాను. వీటిలో ఆయా రంగాలకు సంబంధించిన సాంకేతిక పదజాలంతోబాటు అనుబంధంలో జర్నలిస్టులకు తమ రోజువారీ పనిలో అవసరమయ్యే పలు రంగాలకు సంబంధించిన సమాచారాన్నీ సేకరించాను.

సోవియట్ భూమి సంపాదకునిగా వున్నప్పుడు ప్రారంభించిన ఈ ప్రయత్నానికి, ఆ తరువాత నేను ఆంధ్రప్రభలో చేరినప్పుడు ఒక నిర్దిష్టరూపం వచ్చింది. ఆంధ్రప్రభలో పనిచేస్తున్నప్పుడు నేను అనువాదం చేసిన న్యూస్ ఐటమ్‌లను ఇతర దినపత్రికలలోని మిత్రులు ఎలా అనువాదం చేశారో, ఏ మాటను ఏ అర్థంలో వాడారో, నేను ఉపయోగించిన మాటలకు, నా మిత్రులు వాడిన మాటలకు తేడాగా అనిపిస్తే ఆ మాటల్ని పర్యాయపదాలుగా సేకరించాను.

ఈ పదకోశంలో నేను సేకరించిన పదాలే, రోజువారీ అనువాదంలో ఎదురవు తాయని నేను గ్యారంటీగా చెప్పలేను కానీ, అతి తరచుగా ఎదురయ్యే మాటలు, ఇబ్బందిపెట్టే మాటల్ని ఎక్కువగా ఇందులో పొందుపరిచాను.

అయినా ఇది ఎంతో నిర్దుష్టమైందని నేను చెప్పలేను. ఇందులో నా దృష్టికి రాని, నాకు తట్టని, నేను గమనించని లోపాలు వుండవచ్చు; నేను చేర్చవలసిన అంశాలు ఇంకా ఎన్నో వుండవచ్చు. తదుపరి ముద్రణలో, నా దృష్టికి వచ్చిన, తెచ్చిన వాటిని సరిదిద్దగలను.

ఈ పదకోశం తెలుగు జర్నలిస్టులకు, వారి రోజువారీ వృత్తిలో ఏ మాత్రం ఉపయోగపడినా నా ప్రయత్నం కొంతమేరకైనా ఫలించినట్టే. ఈ పదకోశం పత్రికా రచయితలకే కాక, అనువాదకులకు కూడా సాయపడగలదని ఆశిస్తున్నాను.

ఈ పదకోశం ప్రచురించిన విశాలాంధ్ర ప్రచురణాలయానికీ, ముఖ్యంగా శ్రీ పి. రాజేశ్వరరావు గారికీ, అడిగిన వెంటనే ముందుమాట రాయడానికి దయతో అంగీకరించిన ప్రముఖ పాత్రికేయులు శ్రీ ఎ.బి.కె. ప్రసాద్ గారికీ, సంకలనంలో

అమూల్యమైన సూచనలు చేసిన నా తండ్రి, గురువు అయిన శ్రీ పరకాల పట్టాభిరామారావు గారికీ, నా ప్రయత్నంలో నన్ను ఎంతో ప్రోత్సహించిన నా శ్రీమతి వసంతకూ నేను ఎంతో కృతజ్ఞుణ్ణి.

ఈ పుస్తకాన్ని పూజ్యులైన నా తలిదండ్రులు, శ్రీ పరకాల పట్టాభిరామారావు, శ్రీమతి అహల్యగార్లకు అంకితం ఇస్తున్నాను.

1995 లో 'పత్రికా రచయితల పదకోశం' వెలువడ్డాక ఎంతో మంది నా తోడి జర్నలిస్టులు, ప్రముఖ రచయితలు ఈ పుస్తకాన్ని విస్తృతపర్చాలంటూ ఎన్నో విలువైన సూచనలు ఇచ్చారు. వారి సూచనలతోబాటు మరెంతో అదనపు సమాచారాన్ని చేర్చి, ఓ నూతన గ్రంథంగా 'జర్నలిస్టుల పదకోశం' పేరుతో ఈ పుస్తకాన్ని మీకు అందిస్తున్నాను.

ఈ పదకోశానికి నా సోదర జర్నలిస్టుల ఆదరణ, ప్రోత్సాహం లభిస్తుందని మనసారా ఆకాంక్షిస్తున్నాను.

- పరకాల సూర్యమోహన్.



మద్రాసు తెలుగు అకాడమీ వారినుండి

జర్నలిజంలో *1997*లో ఖాసా సుబ్బారావు అవార్డును

అందుకుంటున్న రచయిత

## Ugadi purashkar - '97




# MADRAS TELUGU ACADEMY

*(A Temple of Culture and a Symbol of Universal Integration)*
25, Malony Road, T'Nagar, Chennai - 600 017

*proudly presents*

## Khasa Subba Rao Memorial Award

For Journalism
for the year 1997
To

**Sri. PARAKALA SURYA MOHAN, M.A.,**
Sr. Sub-Editor, "The Indian Express", Chennai

*for his excellence*
*in the field of Journalism*

Shri. P. Obul Reddy
Hon. Chairman, M.T.A

Dr. K. Viswanath
Hon. President, M.T.A

Shri. Ravi Kondala Rao
Hon. Secretary, M.T.A.

Shri. T.V.K. Shastry
Founder - Chief Convenor

# పుట్టి నేర్చుకొనెనో
# పుట్టక నేర్చెనో.

భాగవతకర్త పోతనామాత్యుడు బాలకృష్ణుడి చేష్టలనే కాదు, వాడి మాటలను కూడా కనిపెట్టి ఉంటాడు: "పుట్టి నేర్చుకొనెనో పుట్టక నేర్చెనో/చిట్టి బుద్ధులిట్టి పొట్టి వడుగు/పొట్టనున్నవెల్ల బూమెలు..." అంటాడు! వాడివి 'తొక్కు పలుకులే' కావచ్చు మాటమీద మాట పుట్టుకురావడం చూచి (లేదా విని) అలా అనవలసి వచ్చింది! ఈ 'తొక్కుపలుకులు' పాత్రికేయ వృత్తిలో (జర్నలిజం) ప్రవేశించే వాళ్లక్కూడా అలవాటే. దానినే పండితులు కొందరు 'జర్నలిజే' అన్నారు. శ్రీశ్రీ కూడా 'పశువుకొక్క భాష/సిసువుకొక్క భాష/మానవుడికి మాత్రం సంఖ్యానంతపు పలుకుబళ్లు' అన్నాడు! ఈ "అనంత పలుకుబళ్ల"తోనే మానవుడు యంత్ర భాషాశాస్త్రానికి కూడా (Cybernetics) ఏతామెత్తాడు; మరమనిషిని అజరామరం చేస్తున్నాడు. అయితే ఈ 'అనంత పలుకుబళ్లు' ఒక్కరి చేతిమీదుగా పుట్టి పెరిగినవి కావు, మొత్తం మానవాళి వేల సంవత్సరాల నాగరికతలో వృద్ధిచేసుకున్న శాస్త్ర, సాంకేతిక, కళా, సాహిత్య, విజ్ఞానాది రంగాలలో అవసరంకొద్దీ ఎదిగివచ్చిన మాటల పోగులే ఈ పలుకుబళ్లు! మూగబాసల నుంచి యాగభాషలవరకు, రాగవరసలదాకా మాటలు మూటలుగా వచ్చిపడ్డాయి! అన్ని నదులూ సాగరముఖంగా సాగిపోయినట్లే, సర్వశాస్త్రాల పరిభాష క్రమంగా నిఘంటు సాగరంలో కలగలసి పోవలసివచ్చింది; ఒక్క తెలుగని ఏమిటి, సకల భాషలకూ (చివరికి సవరభాషకూ) ఏదో స్థాయిలో పెద్దగానో, చిన్నగానో నిఘంటువులు వెలశాయి. కాని అన్ని నిఘంటువులు ఒక ఎత్తు కాగా, పత్రికలలో పనిచేసేవారికి నిత్యమూ వార్తావాహినిలో ముమ్మరించే కొత్త పదాలకు అవసరమైన వ్యావహారికార్థాలను అందించడానికి ప్రత్యేక నిఘంటువుల అవసరం వచ్చింది. 18–19 శతాబ్దాలు సాధారణ నిఘంటువుల యుగంకాగా, 20–21 శతాబ్దులు విభిన్న శాస్త్రసాంకేతిక భాషా, పత్రికా భాషానిఘంటువుల, సమాచార, ప్రసార మాధ్యమాల శబ్దరత్నాకర యుగంగా సంభావించుకోవచ్చు; ఆధునికయుగంలో భాషాశాస్త్రంతో పాటు పత్రికా భాషాశాస్త్రమూ, ప్రచార మాధ్యమాల భాషాశాస్త్రమూ కూడా వృద్ధిచెందుతూ అభినవ "యాస్కులూ", అభినవ "అమరసింహులూ" రంగప్రవేశం చేసి నూతన పదకోశాలను అందిస్తున్నారు! సర్వకళలకూ, శాస్త్రాలకూ, సాహితీవేత్తలకూ, ప్రచారానికీ ముఖద్వారాలుగా పత్రికలు ఏనాడు ఉపయోగంలోకి వచ్చాయో ఆనాటినుంచీ సకలశాస్త్ర పరిభాషకు అవసరమైన అర్థాలమ సమకూర్చే జర్నలిస్టుల పదసంపదకూ ప్రత్యేక నిఘంటువులు అవసరమవుతూ వచ్చాయి; ఈ కృషిలో భాగమే – ఆంగ్లభాషలో ఎడిటర్లకూ, రచయితలకూ, గ్రంథకర్తల అవసరాలకోసమని ప్రత్యేక నిఘంటువును ఒక దశాబ్దం క్రితమే ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రచురించింది. ఫౌలర్ రాసిన "మోడరన్ ఇంగ్లీషు యూసేజీ"కి ఎంత ప్రాధాన్యం వుందో దీనికీ

అంత ప్రాధాన్యం వుంది; తెలుగులో సాధారణ నిఘంటువుల్లో "బ్రౌణ్యం" తరువాత చెప్పుకోదగినవి 'శబ్దరత్నాకరం', 'సూర్యరాయాంధ్ర నిఘంటువు'; అలాగే తెలుగులో మౌలిక వ్యుత్పత్తిపదకోశాలు కూడా వెలువడ్డాయి. కాని తెలుగులో పత్రికా నిఘంటువుల చరిత్రకు పదేళ్లకు మించిన వయస్సు లేదు. మొత్తం అన్ని ప్రసార మాధ్యమాలను కలుపుకొని ఒక బృహత్ నిఘంటు నిర్మాణానికి కూడా పునాదులు వేసుకోవలసిన అవసరం వుందని అంగలు పంగలు వేసుకుని సాగిపోతున్న నూతన సమాచార సాంకేతిక వ్యవస్థ నిరూపిస్తోంది, హెచ్చరిస్తోంది!

తెలుగులో పత్రికా భాషా నిఘంటువులకు బూదరాజు రాధాకృష్ణ శ్రీకారం చుట్టి 'ఈనాడు' వ్యవహారకోశం 1990లో వెలువరించగా, 1995లో సుబ్రమణియన్, కాచినేని రామారావుల సంపాదకత్వాన 1995లో తెలుగు భాషాభివృద్ధిపీఠం తరపున నిఘంటు నిర్మాణశాఖ ఆధ్వర్యంలో "పత్రికా భాషానిఘంటువు" వెలువడింది; తరువాత 1996లో ఎబికె – సతీష్‌చందర్‌ల సంపాదకత్వంలో పాత్రికేయుల ప్రత్యేక పదసంపదగా "పలుకుబడి" పేరిట ఒక నిఘంటువు వచ్చింది; ఆ పిమ్మట ఆచార్య చేకూరి రామారావు సంపాదకత్వాన ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమీ తరపున (1998లో) "పత్రికా పదకోశం" సాధ్యమైనంత సమగ్రంగా తీసుకొచ్చారు. ఈ వరుసలో "జర్నలిస్టుల పదకోశం" అన్న మకుటంతో యువ పాత్రికేయుడు చిరంజీవి పరకాల సూర్యమోహన్ తొలి ముద్రణ పూర్తి చేసుకొని మరికొన్ని చేర్పులతో, మార్పులతో మరొక నిఘంటువు ప్రచురిస్తున్నారు. ఈ యువ నైఘంటికునిలో విశేషమేమంటే – ఆంగ్ల దినపత్రికలో ("హిందూ"లో) పనిచేస్తూ తెలుగులో పాత్రికేయుల కోసం ప్రత్యేక శ్రద్ధతో పదకోశ నిర్మాణానికి సాహసించడం! చిరంజీవి పరకాల ఎంతో పరిశోధించి పరిశ్రమించి 25 అధ్యాయాల్లో విలక్షణమైన నిఘంటువును పత్రికా సిబ్బంది అవసరాలకోసం దిద్ది తీర్చినందుకు అభినందనీయులు. అలా అని ఇది కేవలం పాత్రికేయులకు మాత్రమే పనికొచ్చే నిఘంటువుగా చెప్పేకంటే, సర్వీసు కమీషన్ పరీక్షలకు హాజరయ్యే ఉద్యోగార్థులకు కూడా ఉపకరించే పదకోశంగా చెప్పుకోవచ్చు! ఒకటేమిటి – సర్వశాఖల (అసెంబ్లీ, పార్లమెంటు నియోజకవర్గాల వివరాలు, తెలుగు సంవత్సరాలు, దేశాలు, పార్లమెంటులు, ఎబ్రివేషన్స్ – వాటి ఎక్స్‌పాన్షన్స్, కాలమానాలు, సమానార్థకాలు, వ్యతిరేకార్థాలు, జంటపదాలతో వచ్చే కొన్ని ఇబ్బందులు, వ్యవసాయశాస్త్ర పదజాలం, తెగుళ్ల సమాచారం, రకరకాల ఫోబియాలకు చెందిన పదాలు, విదేశీ నుడులు – నానుడులూ, పత్రికావృత్తిలోని ప్రత్యేక పారిభాషిక పదాలూ, బడ్జెట్ పదజాలం వగైరా) పదజాల సమన్వయం సూర్యమోహన్ కృషి ఫలితం. అయితే ప్రాంతాలవారీగా నిఘంటువులో జిల్లాలను పేర్కొనడం – అంతగా పండొలిచి నోటికి అందించడం – అవసరమా అనిపిస్తుంది! కొందరి దృష్టిలో పాత్రికేయులకు ఇన్ని ప్రత్యేక నిఘంటువులు అవసరమా అన్న అనుమానం రావచ్చు. కాని అన్ని నిఘంటువులూ ఒకే మూసలో పోసిరావు; ఒకటిగా వుండాలనీ లేదు, వుండవలసిన అవసరమూ లేదు. ఒక దాంట్లో చూసిన సమానార్థకాలకూ మరో దానిలోని వాటికీ పోలికలు వుండవచ్చు, అలాగే మరోచోట వ్యతిరేకార్థాల మధ్య ఇంకొకదానితో పోల్చినప్పుడు కొంత వ్యత్యాసమూ వుండొచ్చు.

ఒక నిఘంటువు ఇచ్చిన అర్థాన్ని మరో నిఘంటువు ఇవ్వకపోనూవచ్చు, అలాగే విశేషార్థాలూ యివ్వవచ్చు; ఒక నిఘంటువులో 'ఉరిమిన' పదం మరో నిఘంటువులో 'మెరుపు'గా అవతరించనూ వచ్చు. అర్థాలు బొత్తిగా మారిపోతే తప్ప [ఉదా: జయంతి, వర్ధంతి పదాలకు వ్యవహారంలో అర్థం ఒకట్టై, పదకోశాల్లో వేరొకటిగా వున్నట్టు.] స్థూలంగా ఎప్పటికప్పుడు కొత్తపదాలు పుట్టినప్పుడల్లా కొత్త అర్థాలూ అనుభవంలోకి వస్తూంటాయి; ప్రయోగ వైచిత్రిలో వింతపోకడలకూ అవకాశం వస్తుంది; అందుకు అనుగుణంగా నిఘంటువులూ సవరణలకు తలొగ్గుతూ వుంటాయి. అందువల్ల పదాలు, వాటి అర్థాలలో వుండే వైవిధ్యమే నిఘంటు నిర్మాణంలో కూడా జాలువారుతూంటుంది. అందువల్ల ఏ నిఘంటువునూ పూర్తిగా తోసిరాజనలేము! లోకోభిన్నరుచిః అన్న నానుడికి నిఘంటువులు ఒక ఉదాహరణ. ఇందుకు మరో చిన్న ఉదాహరణ – "గొడుగు" 'గిడుగు' శబ్దార్థాలు. "ఉభయభాషాప్రవీణ" అయిన పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి సంపుటీకరించిన "అచ్చ తెలుగుకోశం"లో (1979) ఎండాకాలంలో వేసుకొనేది "గొడుగు" అనీ, వర్షాకాలంలో వేసుకునేది "గిడుగు"అనీ, "జిడుగు" అనీ వాడుకలో వున్నట్టు రికార్డు చేశారు. [చూ: "అచ్చ తెలుగుకోశము": రెండవ సంపుటం]. ఆంధ్రభాషార్ణవాన్ని ఉదాహరిస్తూ ఇందుకు సోదాహరణంగా "---గొడుగన, గొడువన ఛత్రాఖ్య యడరుచుండు---/వర్షవారణనామమై వరలు గిడుగు, జిడుగనగ---" అని ప్రయోగం చూపారు!

అందుకే భాషాశాస్త్రవేత్తలయిన కొందరు "మానవ సంస్కృతిలో అత్యంత కీలకమైన అంశాల క్రోడీకరణకు మూలం – మాటలు, మాటల మూటలు" అన్నారు [జె. గూడీ, ఐ. వాట్: "The most significant elements of any human culture are channelled through words"]! ఈ మాటల్నే షేక్స్పియర్ "words, words, words" అని ప్రేలాపించుతూండేవాడు! ప్రతీకలు (symbols) ప్రపంచాన్ని ఏలుతూంటే, మాటలు పత్రికల్ని ఏలుతున్నాయి! మనం గొప్పగా రాయాలన్నా, రాసినదాని అర్థాన్నీ, అంతరార్థాన్నీ అంత గొప్పగానూ బట్వాడా చేయాలన్నా, పాఠకుడ్ని ఏదో మెప్పించడంగాక మనం అనుకున్నట్టుగా మెప్పించాలన్నా – పదాల తూకం, మాటల వాడకం, నడతలో వాటి వాలకం క్రమంగానూ, సక్రమంగానూ అమరాలని శైలీసారభానికి మారుపేరైన ఆర్.ఎల్. స్టీవెన్సన్ అన్నాడు! ఉండంత మాటలో కొండంత భావాన్ని చెప్పగల సంక్షిప్త శబ్దచిత్రానికి నిర్మాత మార్క్ ట్వైన్. చమత్కార కథామంజరిని పెంచి పోషించిన ఈయన, పారితోషికాన్ని (డబ్బును) బట్టి పరిభాషను పోషించకూడదని చమత్కరిస్తూ "ఏడు సెంట్లు డబ్బు నాకు ముడుతుందిగదా అని 'సిటీ' అన్న పదం వాడవలసినచోట 'మెట్రోపోలిస్' అన్న పదం వాడబో"నన్నాడు; ఎలాగూ వచ్చే డబ్బులో తేడా వుండదన్నాడు. అలాగే అదే పైసాకు దొరికే "కాప్" అనే పదాన్ని మానుకుని "పోలీస్మాన్" అన్న పదం వాడలేనన్నాడు, ఆత్మలోకంలో దివాళా తనకు ఇష్టం లేదన్నాడు! కాగితాలు కాలిపోతాయి కాని, పదాలు రెక్కలు తొడుక్కుని ఎగురుతుంటాయన్నాడు బెన్ జోసఫ్ అక్కీ!

అంతేగాక, నేడు అసంఖ్యాకంగా అనుక్షణం కొత్తపదాలు వాడకంలోకి వస్తు న్నాయి. ఇనఫర్మేషన్ టెక్నాలజీతో ఈ సద్దు మరింతగా పత్రికా రంగాన్నీ,

జీవన రంగాలనూ ముమ్మరిస్తోంది. ఇంతవరకూ అనేక నిఘంటువుల కెక్కని కొత్తపదాలు కొల్లలుగా ఇటీవల వచ్చిపడ్డాయి. ఉదా: Animatronics (Animation + Electronics + Robotiecs), Butterfly ballot, Butter week, Rorschach test, Glonets, Inforpreneur, Hacktivism, Infotainment, Knowbot, Techie etc.!! కొలది మాసాలనాడు మాత్రమే విడుదలైన పెంగ్విన్ డిక్షనరీ మరికొంత విలక్షణమైన మార్గం తొక్కింది; పదకోశాన్ని సర్వశాస్త్ర కళాక్షేత్రంగా భావించి ప్రాచీన పదసంపదతో సహా ఆధునికశాస్త్రాలు గుమ్మరిస్తున్న అనంత శబ్దరాశికి నూతనార్థాలు చూపించింది; పద ప్రయోగాల తీరుతెన్నుల్ని తెలిపింది; పెక్కు మాటలకు అర్థాలకు సందర్భోచితంగా అతికేట్టుగా పాఠకులకోసం ప్రసిద్ధ సాహితీమూర్తుల రచనలనుంచి ఉదాహరించి, నిఘంటువును బహుముఖీన శబ్దరాశిగా మలచింది! పదచరిత్ర, మాండలికాల స్వరూపాలు, నుడికారాల సొంపుసొంపులు, ఉచ్చారణ తీరుతెన్నులూ చూపాడు సంపాదకుడు రాబర్ట్ ఎలెన్. ఎందుకంటే, కొన్ని పత్రికా పదకోశాలు (ఉదాహరణకు) "ఆర్మగెడ్డాన్" అన్న పదానికి "అంతిమ యుద్ధం"/మహాసంగ్రామం అని సరిపెట్టుకున్నాయి గాని ఆ పదం పుట్టుపూర్వాలకు పోలేదు. కాని పెంగ్విన్ సంపాదకుడు అటువంటి చోట్ల పాఠకునికి హత్తుకునేలా సంక్షిప్త చరిత్రను రెండు వాక్యాల్లో అందించాడు. బైబిల్ కొత్త నిబంధనము (New Testament) పేర్కొంటూ చెస్టరన్ వాక్యాల్ని ఉదాహరించాడు: "I am still as much concerned as ever about the Battle of Armageddon, but I am not as much concerned about the General Election." అలాగే ఇటీవల "Anti-dictionary word book" అన్న పేరుతో (రచన సి. వెంకట్రావు, చార్టర్డ్ అక్కౌంటెంట్, భాషాభిమాని) ఒక విలక్షణమైన పదకోశం వచ్చింది. ఇందులో అతి అరుదైన పదాలున్నాయి, ప్రయోగాలున్నాయి, సాధారణార్థంలో ప్రయోగించని మాటలకు అర్థాలూ, నానార్థాలూ వున్నాయి. ఇది విద్వత్‌గోష్ఠుల, విశ్వవిద్యాలయాల పరిధుల్ని అతిక్రమించి సాగిన కొత్త కూర్పు. [ఉదా: Economic Refugee, food-terrorist, green-mail, Agridisarmament, Alphaman, Zombie food, Watchpoodle, Villagization etc]. మనం ఇంతటి పదసంపదకు వారసులం కావాలంటే నిరంతర అధ్యయనం, అభ్యాసం పాత్రికేయులకు కూసువిద్య కావాలి! సృష్టికి ప్రతిసృష్టి అంటే పదసృష్టే సుమా!

- ఎ.బి.కె. ప్రసాద్
సీనియర్ ఎడిటర్,
గ్రంథకర్త.

* * *

# పత్రికా రచయితల పదకోశం పై శ్రీ నండూరివారి వ్యాఖ్య

Journalism is a most challenging profession. ఈ సుభాషితం ఎవరబ్బా అన్నది? ఎవరో ఏమిటిలెండి. నేనే ఎప్పుడో అనుంటాను.

ఆ మాటకొస్తే, నేనేకాదు. ప్రతి జర్నలిస్టూ ఎప్పుడో ఒకప్పుడు ఈ మాట అనే వుంటాడు; అట్టే మాట్లాడితే, ఎప్పుడో ఒకప్పుడు కాదు, ప్రతిరోజూ ఒకసారైనా అనుకుంటూనే వుంటారు.

నిజమే మరి. Journalism is a most challenging profession. జర్నలిజం అడుగడుగునా ఒక సవాల్. ఇంతలో ఎక్సయిట్‌మెంట్, ఇంతలో డిప్రెషన్, క్షణంలో పొంగిపోవడం, క్షణంలో కుంగిపోవడం.

జర్నలిస్టులపై రాజకీయమైన ఒత్తుడులో సాంఘికమైన సవాళ్ళు మొదలైనవి అలా వుంచండి. వృత్తిగతమైన సవాళ్లు, సమస్యలు సవాలక్ష. Never a dull moment in Journalism.

మళ్లీ జర్నలిస్టులలోనే రెండు రకాలవారుంటారు. ఒకరు రిపోర్టర్లు, మరొకరు సబ్‌ఎడిటర్లు. వారి సమస్యలు వేరు, వీరి సమస్యలు వేరు.

ఒక వార్తను సాదా సీదాగా వ్రాయాలా, డ్రమెటైజ్ చేయాలా; తెలిసింది తెలిసినట్లుగా పూర్తిగా వ్రాయాలా, లేక అలా వ్రాస్తే కొంపలంటుకుంటాయి కనక, కొంతదాచి, కాస్త అచితూచి వ్రాయాలా; కాస్తంత భాషా పాండిత్యం ఒలకబోయవచ్చునా; లేక పొడిపొడి మాటలతో వ్రాస్తే సరిపోతుందా; వార్తను మూడు ముక్కలలో ముక్తసరిగా ముగించాలా లేక పాఠకుడివి ఊరిస్తూ ఊరిస్తూ పెంచి వ్రాయాలా – ఇవి ప్రతి రిపోర్టరుకు వార్త వ్రాసేటప్పుడు ఎదురయ్యే ప్రశ్నలు.

ఇక రెండో రకం జర్నలిస్టులు సబ్‌ఎడిటర్లు, సారీ – రెండోరకం జర్నలిస్టులంటే, సబ్‌ఎడిటర్లు రిపోర్టర్లకంటె తక్కువ రకంవారని కాదు నా ఉద్దేశం. నిజానికి ఈ రెండు వర్గాల జర్నలిస్టులలోను పిసరంత rivalry, కొసరంత Jealousy లేకపోలేదనుకోండి. రిపోర్టర్లు, సబ్‌ఎడిటర్లు ఎవరికి వారే తామే గొప్ప అనే పోజు పెడతారు. "వార్తలు ఆఫీసుల్లో నాలుగ్గోడలమధ్యా జరగవు. ఆరుబయట, రోడ్లమీద, సభాస్థలాలలో, ఎక్కడెక్కడో అడవుల్లో, అజ్ఞాత ప్రదేశాల్లో జరుగుతాయి. అవన్నీ కష్టపడి తిరిగి సేకరించి తెచ్చేదెవరు, మేమేకదా? మేము వార్తలు తీసుకురాకపోతే మీరు పేపరు ఎలా నింపుతారు, వ్యాసాల్తోనా, సంపాదకీయాల్తోనూనా? అవన్నీ

ఎవరిక్కావాలి? కావల్సివచ్చినా, హాట్ హాట్ వార్తల తర్వాతే కదా అవీ?" అని కొంచెం సుపీరియారిటీ పేస్ పెడతారు రిపోర్టర్లు. కాని, సబ్ఎడిటర్లేనా తక్కువ తిన్నది? "అవునయ్యా, మీరు తిరిగి తిరిగి వార్తలు తెస్తారు నిజమే. కాని, మీరు తెచ్చే వార్తలు మాకు – అంటే పేపరుకి – వట్టి ముడిసరుకు. అదంతా as it is గా అచ్చేస్తే, అచ్చేసినట్టే వుంటాయి. మీకు ఏ వార్త ఎంత వ్రాయాలో తెలియదు. ఎలా ప్రారంభించాలో, ఎలా ముగించాలో తెలియదు. మీరు తెచ్చిన ముడిసరుకును ఒక పద్ధతిలో తీర్చి దిద్ది, భాషకి మెరుగులు దిద్ది, డ్రమటిక్‌గా మొదలుపెట్టి, సెన్సేషనల్‌గా ముగించి, ఆకర్షణీయమైన హెడ్డింగ్‌లు పెట్టి, ప్రజలకిచ్చే దెవరు, మేమేకదా? సబ్ఎడిటర్లు లేకపోతే పేపరు ఎలా వస్తుంది?" అంటారు సబ్ఎడిటర్లు.

ఇవన్నీ ఇంటర్నల్ ప్రొఫెషనల్ రైవల్రీలు. సబ్ఎడిటర్లూ ముఖ్యమే, రిపోర్టర్లూ ముఖ్యమే. ఈ సంగతి ఎవరైనా సరే, ఒప్పుకోక తప్పదు.

ఇదంతా ఎందుకు చెప్పాల్సివచ్చిందంటే – వార్తాపత్రికలో సమాన ప్రాముఖ్యం కలిగిన రిపోర్టర్లు, సబ్ఎడిటర్లలో ఎవరి సమస్యలు వారివి. రిపోర్టర్ల సమస్యలలో కొన్నిటిని పైన పేర్కొన్నాను. ఇక సబ్ఎడిటర్ల సమస్యలు. ఇందులోను వెర్నాక్యులర్ జర్నలిజంలో–తెలుగు దినపత్రికలలో–పనిచేసే సబ్ఎడిటర్ల సమస్యలు వేరుగా వుంటాయి. వీరు ఎదుర్కొనే సమస్యలలో ముఖ్యమైనవి అనువాద సమస్యలు. తెలుగు వార్తా పత్రికలకి, విధిగా, అనివార్యంగా, అధికభాగం వార్తలు – అంటే జాతీయ, అంతర్జాతీయ వార్తలు – ఇంగ్లీషులో వస్తాయి. పి.టి.ఐ, యు.ఎన్.ఐ. వంటి వార్తా సంస్థలు ఇంగ్లీషులో పంపించే వార్తలను తెలుగు చేయవలసిన బాధ్యత సబ్ఎడిటర్లదే. అలా వార్తల్ని తెలిగించే సందర్భంలో వారు ఎదుర్కొనే సమస్యలు ఇన్నీ అన్నీ కావు.

ఇంగ్లీషు వార్తని తెలుగుచేయడం ఒక ఆర్ట్. "అనగననగ రాగమతిశయిల్లుచు నుండు"అన్నట్టు ప్రాక్టీస్ చేయగా చేయగా ఈ ఆర్ట్ బైహార్ట్‌గా వచ్చేస్తుంది. అయినా, సమస్యలు సమస్యలే. ఇవాళ వచ్చిన సమస్య రేపురాదు. ఎందుకంటే, ఇవాళ వచ్చిన మాట రేపురాదు. ఎప్పటికప్పుడు కొత్తే. అనువాదకుడికి ఎప్పటికప్పుడు పరగడుపే.

ఇంగ్లీషులోని వార్తని అనువదించేటప్పుడు మూలంలో వున్నదాన్ని అనవసరమనుకుంటే వదిలేయనైనా వదిలేయవచ్చుగాని, లేనిదాన్ని చేర్చరాదు. డ్రమటిక్ ఎఫెక్ట్‌కోసంగాని, అది అనువాదం అని తెలియకుండా చేయడానికిగాని, కాస్తంత సొంత పైత్యం వెలిగించవచ్చుగాని, మరీ అభూతకల్పనగా అనిపించేటంత లైసెన్సు తీసుకోరాదు. అలా మరీ మితిమీరిన స్వేచ్ఛానువాదం అయితే, ఈ వార్త నిజమేనా, లేక సబ్ఎడిటర్‌గారి స్వకపోలకల్పనా అని, వార్త క్రెడిబిలిటీని సందేహించవలసి వస్తుంది.

మరీ స్పెసిఫిక్‌గా అనువాద సమస్యల్ని పేర్కొనాలంటే – ముఖ్యంగా చెప్పవలసినవి ప్రతి ఇంగ్లీషు మాటకి సరైన తెలుగుమాటని ఎంపికచేసుకోవడం; అదివరకే తెలుగులో సరైన మాట లేకపోతే కొత్తమాటని coin చేసుకోవడం. అందులోనూ తీరుబడిగా

ఒక రోజంతా ఆలోచించి, వారినీ వీరినీ సంప్రదించి, సరైన మాటను ఉపయోగించడం కాదు. Newspaper production is a race with time. పైగా Time and translation wait for nobody. క్షణాల్లో అనువాదంచేసి, అలా అనువాదం చేస్తూనే, సరైన విధంగా ఎడిట్‌చేసి పడెయ్యాలి.

అందువల్ల ప్రతి సబ్‌ఎడిటరూ అటు ఇంగ్లీషులోనూ, ఇటు తెలుగులోనూ సమానమైన పాండిత్యం సంతరించుకుని వుండాలి. భాషలో పాండిత్యమేకాదు, విషయపరమైన పాండిత్యంకూడా సంపాదించుకుని వుండాలి. పాలిటిక్స్, ఎకనామిక్స్, ఫిజిక్స్, అస్ట్రానమీ, మెడిసిన్, సోషియాలజీ, ఆంత్రోపాలజీ, లిటరేచర్, హిస్టరీ, జాగ్రఫీ, జియాలజీ – ఒకటేమిటి – Every thing under the Sun and also above the Sun - సబ్‌ఎడిటర్‌కి కాస్తంతయినా తెలిసివుండాలి. అంటే ప్రతి సబ్‌ఎడిటరూ ఒక చిన్నసైజు సర్వజ్ఞుడు అయివుండాలి. Mr. Know All అనిపించుకొనడానికి ప్రయత్నించాలి. Every thing of Everything ఎలాగూ మానవసాధ్యంకాదు కనుక, Everything of Something తెలుసుకోవడం కూడా జర్నలిజానికి అంతగా ఉపకరించదు కనుక, Something of Everything తెలుసుకొనడానికి సబ్‌ఎడిటర్లు ప్రయత్నించాలి. లేకపోతే అనువాద సందర్భంలో పప్పులాంటి తప్పులో కాలేస్తారు. తాము అభాసుపాలై, పత్రికనీ, పత్రికాసంపాదకుడిని, పత్రికబాసునీ కూడా అభాసుపాలు చేస్తారు.

అటువంటి Something of Everything అనిపించుకునే General Knowledge కోసం, తెలుగు జర్నలిస్టులకు ఉపయోగపడే పుస్తకాలు ఎన్నయినా రావలసివుంది. వీటిని ప్రత్యేకంగా అనుభవజ్ఞులైన జర్నలిస్టులే వ్రాస్తే బాగుంటుంది. జర్నలిస్టులు వ్రాయడమే న్యాయం కూడా. జర్నలిస్టులకోసం, జర్నలిస్టులు వ్రాయక ఇంకెవరు వ్రాస్తారు? జర్నలిస్టుల సమస్యలు జర్నలిస్టులకంటే ఎవరికి బాగా తెలుస్తాయి?

ఇదుగో, అటువంటి ఉపయుక్త గ్రంథావళి దిశగా మరొక ముందు అడుగు నా మిత్రుడు పరకాల సూర్యమోహన్ సంకలనం చేసిన "పత్రికా రచయితల పదకోశం." డెస్క్ దగ్గర కూర్చుని, బుగ్గన కిళ్ళీ బిగించి, సిగరెట్‌పై సిగరెట్ దమ్ము లాగుతూ, తల ఓరగా వంచి, తదేకంగా, పిటిఐ, యుఎన్ఐ వార్తలో, సిండికేటెడ్ వ్యాసాలో, మరొకటో, ఎడిట్‌చేస్తూనే అనువాదంచేస్తూ, అనువాదం చేస్తూనే ఎడిట్ చేస్తూ, డ్రడ్జరీకి లోనయ్యే జర్నలిస్టులకు చీకటిలో చిరుదివ్వెలా ఉపయోగపడగలదని ఆశించడానికి వీలైనదిగా ఈ సంకలనాన్ని సంకల్పించారు సూర్యమోహన్‌గారు. మామూలుగా వార్తానువాద సందర్భంలో వచ్చే ఇంగ్లీషు మాటలకు సరైన తెలుగు మాటలను, లేదా వివరణాత్మకమైన అర్థాలను సేకరించి, కొత్తగా రూపొందించి, ఇందులో సంకలించారు. ఇది సర్వసమగ్రంకాదని వేరే చెప్పనక్కరలేదు. జర్నలిస్టులకోసం ఉద్దేశించిన ఏ పదకోశం ఎప్పుడూ సర్వసమగ్రం కాజాలదు. ఎందుకంటే ఎప్పటికప్పుడు ఎన్నో కొత్త మాటలు ఇంగ్లీషువార్తలలోకి వచ్చి చేరుతున్నాయి. ఇంగ్లీషు వార్తల ద్వారా ఇంగ్లీషు భాషలోకి చొచ్చుకువస్తున్నాయి.

1957 కు ముందు ఇంగ్లీషులో Sputnik అనే మాట లేదు. Soyuz కూడా లేదు. ఇలాంటి మాటలు ముందు "వార్తలలోని మాటలై" ఆ తర్వాత భాషలో చేరుతాయి. అందుచేత జర్నలిస్టుల పదకోశాన్ని ఎప్పటికప్పుడు పెంచుకుంటూ పోవలసిందే. పైగా ఈ పుస్తకం ఈ కోవకి చెందిన తెలుగు జర్నలిజం గ్రంథాలు రెండు మూడింటిలో రెండోదో, మూడోదో. అది అలా వుంచి ఇది సూర్యమోహన్ తొలిప్రయత్నం. మొదటి ఎడిషన్. దీన్ని ఇంకా పెంచవలసిన అవసరం, ఇంకా ప్రామాణికంగా పెంపొందించవలసిన అవసరం కూడా వున్నాయి.

ఇంగ్లీషు మాటలకి తెలుగు మాటలు, తెలుగు అర్థాలే కాక, సూర్యమోహన్ ఇంకా ఎంతో విలువైన అనుబంధ సమాచారాన్ని ఈ గ్రంథంలో చేర్చారు. ఐక్యరాజ్యసమితి సభ్యదేశాలు, వాటి రాజధానులు, వాటి కరెన్సీలు, వాటి పార్లమెంటులు, వాటి కాలమానాలు మొదలైన ఉపయుక్త సమాచారం కూడా ఇందులో వుండడం వల్ల జర్నలిస్టులకు ఇదొక ready reckoner లాగా ఉపయోగపడుతుంది.

నండూరి రామమోహనరావు

# ఇందులో...



★ ★ ★

# 1. జర్నలిస్టుల పదకోశం

## A

A fortiori గట్టి కారణం
A la carte మెనూ ప్రకారం
Ala mode ఫాషన్ లేదా ఆచారం ప్రకారం
A little కొంచెం
AM (Ante meridian) ఉదయం
A priori సంఘటన పూర్వాపరాలు
A severe school కఠిన పాఠశాల
A talented organiser దక్షతగల కార్యకర్త
Ab initio మొదటినుంచి
Abase తక్కువ చేయు, హీనపరచు, దుర్వినియోగ పర్చు
Abatement తగ్గించడం
Abatement of tax పన్నులు తగ్గించడం
Abbreviations సంక్షేపణాలు
Abdicate త్యజించడం
Abdomen పొత్తికడుపు
Abduction చట్టవిరుద్ధంగా అపహరించడం, బలాత్కార అపహరణ
Aberration సాంప్రదాయానికి విరుద్ధంగా
Abetter తోడుదొంగ, నేరస్తునికి సాయపడువాడు
Abeyance తాత్కాలికంగా రద్దు చేయడం, అనిశ్చిత పరిస్థితి, ప్రస్తుతం అమలులో లేని
Abiding contribution చిరకాలం నిల్చే తోడ్పాటు, దోహదం
Abilities శక్తి సామర్థ్యాలు
Abject నికృష్ట, దయనీయ
Abjure త్యజించు, తిరస్కరించు
Able-bodied దృఢకాయులు
Abolition of exploitation దోపిడీ విధానం రద్దు
Abominate ద్వేషించడం
Aboritive trial తీర్పు ఇవ్వకుండా కేసు ఆగిపోవడం
Aborted coup విఫలమైన తిరుగుబాటు
Abortion గర్భ స్రావం
Above all అన్నిటికన్నా ముఖ్యంగా, ప్రప్రధానంగా, అన్నిటికి మించి, పైగా
Above and beyond అదనంగా, అవసరానికి మించి
Above suspicion ఎంతో నిజాయితీగల, అనుమానించ వీలులేని
Abrasion అరిగిపోవడం, తరిగిపోవడం
Abrogate రద్దుచేయడం
Abscess కురుపు,వ్రణం, చీము
Absent minded పరాకు, పరధ్యానం
Absentee landlord పరోక్ష భూస్వామి, గైరు హాజరు భూస్వామి
Absolute accuracy నిరపేక్షకరమైన యదార్థత
Absolute idea శుద్ధభావం
Absolute majority పూర్తి మెజారిటీ
Absolute monopoly పూర్తి గుత్తాదిపత్యం
Absolute terms (in) నిరపేక్షంగా
Absolve నిర్దోషి అని చెప్పడం
Abstain గైరు హాజరు కావడం
Abstinance పరిత్యాగం, నిగ్రహం
Abstract అనిర్దిష్ట, అమూర్త
Abstract bill సంగ్రహ బిల్లు
Absurd అసంబద్ధమైన
Abuse దుర్వినియోగం, దూషణ
Abyss అంతులేని అగాధం
Acacia తుమ్మచెట్టు
Academy of sciences విజ్ఞాన శాస్త్రాల అకాడెమీ
Accede అంగీకరించడం, కట్టబెట్టడం

Accelerate సత్వరంగా, త్వరితంగా
Accept స్వీకరించు
Accessible అందుబాటులో
Accident insurance ప్రమాదబీమా
Acclaim అభినందన, పొగడ్త
Accolade ప్రత్యేక పొగడ్త
Accomplices దుష్కార్యంలో భాగస్వాములు, తోడినేరస్తుడు
Accomplishments విజయాలు
Accord ఒప్పందం
Account for వివరించడం
Accountability జవాబుదారి
Accredition అధికృత, అధికార ప్రాతినిధ్యం
Accumulation of capital పెట్టుబడి పోగు బడడం, పెట్టుబడి సమీకరణ
Accused నేరస్తుడు, నిందితుడు, ముద్దాయి
Achievement motivation సాధించాలనే తపన, సాధించవలసిన ఆవశ్యకత
Achilles tendon పిక్క కండరం
Achilles' heel లోపం, బలహీనత, ఆయువు పట్టు
Acid rains ఆమ్ల వర్షాలు
Acid test కఠినపరీక్ష, అగ్నిపరీక్ష
Acme ఉన్నత, శిఖరాగ్ర
Acoustic nerve ధ్వనినాడి
Acoustical energetics ధ్వనిశక్తి శాస్త్రం
Acquiesce నోరెత్తకుండా అంగీకరించడం
Acquired property స్వార్జితపు ఆస్తి
Acquitted నిర్దోషిగా విడుదల చేయడం
Acrphobia ఎక్కువ ఎత్తు అంటే భయపడడం
Act one's age వయస్సుకు తగ్గట్టు వ్యవహరించడం
Act upto అనుగుణంగా వ్యవహరించడం
Action taken report (ATR) తీసుకున్న చర్యల నివేదిక
Active part క్రియాశీలపాత్ర, చురుకైనపాత్ర
Active participation క్రియాశీలంగా పాల్గొనడం, క్రియాశీల భాగస్వామ్యం
Actively చురుకుగా, క్రియాశీలంగా
Actively support క్రియాత్మకంగా సమర్థించడం
Actual observation వాస్తవిక పరిశీలన
Actuated ప్రేరణ స్ఫూర్తి
Acumen నైపుణ్యత
Ad idem ఒప్పందంతో
Ad infinitum అపరిమితంగా, అదుపు అదుపు లేకుండా
Ad nauseam విసుగు పుట్టించే విధంగా, అసహ్యం, మొహం మొత్తడం
Ad valorem విలువ ప్రకారం
Ad varolem duty and taxation దిగు మతులపై సుంకాలు, ఉత్పత్తుల విలువకు తగిన సుంకం విధించడం
Adam's ale నీరు
Adam's apple మెడ దగ్గర థైరాయిడ్ గ్రంథి కాయలా కనపడటం
Adapt అనుగుణంగా, అనుసరించడం
Add fuel to fire మండే కట్టెని ఎగదోయడం, అగ్నికి ఆజ్యం
Add insult to injury పుండుమీద కారం చల్లడం
Added value tax సమీకృత విలువపై పన్ను
Adder విషసర్పం
Addisons's disease మూత్రపిండాల వ్యాధి
Addition కూడిక
Additive method సంకలిత పద్ధతి
Adenoids ముక్కులో కొయ్యకండలు పెరగడం
Adept నేర్పరి
Adjourn sine die నిరవధికంగా వాయిదా పడడం
Adjournment వాయిదా
Adjure విజ్ఞప్తి చేయడం, ఆజ్ఞాపించడం
Adjustments సర్దుబాటులు
Administered price ఉత్పత్తిదారు నిర్ణయించే ధర, నియంత్రిత ధర
Admission ప్రవేశం, అనుమతి, అంగీకరించడం, ఒప్పుకోవడం
Admonish చీవాట్లు, మందలింపు
Ado గందరగోళం, ఆందోళన
Adolescents తరుణవయస్కులు
Adopt అనుసరణ, దత్తత
Adulate అతిగా పొగడడం, ముఖస్తుతి
Adult suffrage వోటు హక్కు, వయోజన
Advance పురోగమనం
Advance money బయానా

Advance training పురోగామి శిక్షణ, ఉన్నత స్థాయి శిక్షణ
Advanced ప్రవర్ధిత, పురోగామి, ఉన్నతస్థాయి
Advanced in years వృద్ధాప్యం, పెద్దతనం
Advanced methods పురోగామి పద్ధతులు, ఉన్నతస్థాయి పద్ధతులు
Adversary ప్రత్యర్థి
Adverse ప్రతికూల, విరుద్ధ, వ్యతిరేకత
Advert ప్రస్తావిస్తూ (లోగడ పేర్కొన్నదానిని)
Adviser సలహాదారు
Advocate న్యాయవాది
Aerobic వాయుగత, ప్రాణవాయువుకు సంబంధించిన, చురుకుగా
Aerodynamics వాయుగతి శాస్త్రం
Aerolites ఉల్కలు
Aesthetic education కళాబోధ
Aesthetic poetry రసాత్మక కవిత్వం
Aesthetic sensibilities రసాభిజ్ఞతాశక్తులు
Aesthetic views రసాభిజ్ఞతా భావాలు
Affair d'amour ప్రేమవ్యవహారం
Affidavit అఫిడవిట్, ప్రమాణపత్రం
Affinity సాన్నిహిత్యం, సన్నిహితతత్వం
Affinity of position సన్నిహిత వైఖరులు
Affinity of views భావ సాన్నిహిత్యం
Affirm (to) చాటిచెప్పడం, ధ్రువపరచడం
Affluent సంపన్న
Affluent society సంపన్న సమాజం
Aficionado అభిమాని, ఉత్సాహవంతుడు
Afore mentioned లోగడ పేర్కొన్నవిధంగా
Afore said లోగడ చెప్పినవిధంగా
Afterbirth మావి
Agate గోమేధికం
Age old ప్రాచీన
Age old economic backwardness యుగయుగాల ఆర్థిక వెనుకబాటుతనం
Agglomerative forces కేంద్రీకృత శక్తులు
Aggrandisement గొప్పతనాన్ని, సంపదను పెంచుకోవడం
Aggravate విషమించడం
Aggregate మొత్తం
Aggregate analysis సమిష్టి విశ్లేషణ
Aggression దురాక్రమణ
Aggresive nationalism దురాక్రమణ పూరిత జాతీయవాదం
Aggrieved party నష్టపడిన కక్షిదారు
Agility చురుకుదనం
Agitation ఆందోళన
Agnostic దేవునిపట్ల నమ్మకం లేనివాడు
Agoraphobia బహిరంగ ప్రదేశాలంటే భయపడటం
Agrarian వ్యావసాయిక
Agreed in principle సూత్రప్రాయంగా అంగీకరించడం
Agricultural social sector సామాజీకీకృత వ్యవసాయరంగం
Agronomics పంటల లేదా నేల నిర్వహణశాస్త్రం, వ్యవసాయ నిర్వహణశాస్త్రం
Agronomy భూసార నిర్వహణ, పంటలు పండించడం, వ్యవసాయ శాస్త్రం
Agrostoloty వివిధ రకాల గడ్డి అధ్యయన శాస్త్రం
Ague మలేరియాకు పాతపేరు
Agust body గౌరవప్రదమైన సంస్థ
Aid and abet వత్తాసు, సమర్థన, పెంచి పోషించడం, దుష్ప్రేరణ
Aide-de-camp (A D C) అంగరక్షకుడు
Aims లక్ష్యాలు
Air continental ఖండాన్తర్గత వాయువు
Air equatorial భూమధ్యరేఖాప్రాంత వాయువు
Air mass వాయురాశి
Ajoic era నిర్జీవ దశ
Akin వాస్తవాన్ని పోలిన, అదేవిధమైన
Alacrity సందడి
Albeit అయినప్పటికీ
Alcohol సారాయి
Alderman పౌరప్రముఖుడు, పెద్ద
Al fresco ఆరుబైట, తాజాగా
Algebra బీజగణిత శాస్త్రం
Alias ఉరఫ్
Alien అన్య, విదేశీ
Alien ideas అన్యవర్గ భావాలు
Alienate (to) అన్యధీకరించు, పరాయీకరణ
Alienation అన్యాక్రాంతం
Alligator మొసలి

Alight from, at దిగడం
Alimentary canal అన్నవాహిక
Alimony మనోవర్తి
Alkali క్షారం
All agog ఆదుర్దా
All but దాదాపుగా
All embracing సర్వవ్యాపితమైన
All oppressed nations సకల పీడిత జాతులు
All people and nations of the world సమస్త దేశాల ప్రజలు, జాతులు
All pervasive atmosphere సర్వవ్యాప్తమైన వాతావరణం
All round development of individual వ్యక్తి సర్వతోముఖవికాసం
All the rage వేలం వెర్రి, ఎంతో ప్రాచుర్యం పొందిన
All the time నిరంతరం
All together సమష్టిగా, అంతాకలసి
Allegiance విధేయత
Alleviate ఉపశమనం కలిగించడం
Alliance బాంధవ్యం, పొత్తు, ఒప్పందం
Alloy మిశ్రమ లోహం
Allude పరోక్షంగా ప్రస్తావించడం
Allusion ప్రస్తావన, సూచన
Ally బంధుశక్తి, మిత్రము
Alma matter విశ్వవిద్యాలయం
Almanac పంచాంగం
Almund బాదం పప్పు
Alpha and omega ఆదినుంచి అంతంవరకూ
Already ఇదివరకే
Altar బలిపీఠం
Alter మార్పు చేయడం
Altercation ఘర్షణ, పోట్లాట
Alternate days రోజువిడిచి రోజు
Alternative ప్రత్యామ్నాయం
Alternative uses ప్రత్యామ్నాయ ప్రయోజనాలు
Altimeter ఎత్తును కొలిచే సాధనం
Altitude ఎత్తు
Altogether సంపూర్ణంగా, మొత్తంమీద
Altruism పరహిత తత్వం, పొరుగువాడికి తోడ్పడే ధోరణి
Alum పటిక
Amalgamated enterprises సమ్మిళిత పరిశ్రమాదులు
Amalgamation సంయోగము
Amaranthus తోటకూర
Amaranth చెంగల్వ పువ్వు
Amateur ఔత్సాహిక
Amazed దిగ్భ్రాంతి చెందడం
Ambassador రాయబారి
Ambiguous అస్పష్టమైన
Ambivalance రాగద్వేషాలు
Ambush మాటువేసి దాడిచేయడం
Amendment సవరణ
Amicable settlement సమరస పరిష్కారం
Aminocentesis గర్భంలోని బిడ్డ లింగ నిర్ధారణ పరీక్ష
Ammeter విద్యుత్ప్రవాహాన్ని కొలిచే సాధనం
Ammonium chloride నవాసారం
Ammunition మందుగుండు
Amnesty క్షమాభిక్ష
Amphibious ఉభయచరం, భూజలచరం
Amply పుష్కలంగా
Amputation కాలు, చేయి కోసివేయడం, తీసివేయడం
Amulet తాయెత్తు
An account to settle పగ తీర్చుకోవడం
An appropriate level తగిన స్థాయిలో
Anemia రక్తహీనత
Anaesthetist మత్తుమందు ఇచ్చే డాక్టర్
Analgesic నొప్పి నివారిణి, నొప్పి, బాధ తగ్గించే మందు
Analysis విశ్లేషణ
Analytical proof విశ్లేషణాత్మక రుజువు
Anaranthus weevil ముక్కుపురుగు
Anarchism అరాచక వాదం
Anarcho-syndicalism అరాచకవాద సిండికలిజం
Anathema శాపం
Anatomy శారీరక శాస్త్రం
Ancestral property పిత్రార్జిత ఆస్తి
Anchor లంగరు

Ancient continental society ప్రాచీన ఖండ సమాజం
Androphobia పురుష భయం
Anemmometer గాలివేగాన్ని, దిశను కొలిచే సాధనం
Anguish మానసిక వ్యథ
Angular diagram కోణీయ పటం
Animadversion ప్రతికూల విమర్శ
Animus తీవ్ర ద్వేషభావం, ఉద్దేశ్యం
Anise tree సోపు చెట్టు
Ankle చీలమండ
Anklet కడియం, అందెలు
Annexation చేర్చుకోవడం, కలుపుకోవడం
Anno domini (AD) క్రీస్తుశకం
Anorexia ఆకలి లేకపోవడం
Annual profit వార్షికలాభం
Antagonism వైరుధ్యాలు
Antagonistic classes వర్గవైరుధ్యాలు, వైరుధ్య వర్గాలు
Antagonistic contradictions శత్రు వైరుధ్యాలు
Antarctic దక్షిణధ్రువం
Ante diluvian attitude ప్రాచీన ధోరణి
Ante meridian (AM) ఉదయం
Ante natal ప్రసవానికి ముందు
Antecedents పూర్వాపరాలు
Anterior ముందుభాగాలు
Anthracnose మచ్చతెగులు
Anthropology మనుష్య అధ్యయన శాస్త్రం
Anti party వైరం, శత్రుత్వాలు
Anti-aircraft guns విమాన విధ్వంసక శతఘ్నులు
Anti-ballistic missile systems రాకెట్ ఆయుధ విధ్వంసక వ్యవస్థ
Anti-dote విరుగుడు
Anti-dumping act ఒక దేశం తన ఉత్పత్తులతో మరోదేశపు మార్కెట్లను ముంచెత్తకుండా నిరోధించే చట్టం
Anti-imperialist orientation సామ్రాజ్య వ్యతిరేక లక్ష్యం
Anti-social సంఘ వ్యతిరేక
Anti body శరీరంలో ఉత్పత్తి అయ్యే రక్షణ పదార్థాలు (ప్రొటీన్లు)
Antilope జింక
Antipyretic జ్వర నివారిణి, జ్వరం తగ్గించే మందు
Antiques ప్రాచీన కళాఖండాలు, ప్రాచీన వస్తువులు
Antiseptic విష క్రిమి నాశని
Anvil తయారీలో, సన్నాహంలో
Any part thereof దానిభాగం ఏదైనా
Aorta బృహద్ధమని
Apartheid జాతి వెలివిధానం
Apathy నిర్లిప్తం
Aphids పేను, పీడ
Aphorism సూక్తి, నీతివచనం
Aphrodisiac కామప్రేరక, సెక్సును ప్రేరేపించే
Apiarist తేనె పెంపకందారు
Aplomb ఉద్వేగపూరితంగా,నైపుణ్యంతో
Apocryphal యదార్థంకాని, కృత్రిమ, పోలి వుండటం
Apogee పరాకాష్ఠ, సుదూర ప్రాంతం, భూకక్ష్యా మార్గం
Apolitical రాజకీయాలకు దూరంగా
Apologists వకాల్తాదారులు, సమర్థకులు
Apostasy త్యాగం చేయడం, త్యజించడం, ఫిరాయించడం
Apotheosis దైవప్రేరితమైన
Appalate court అప్పీలు కోర్టు, అప్పీలు స్వీకరించే కోర్టు
Appaling స్పష్టంగా
Apparel దుస్తులు
Appear in person స్వయంగా హాజరుకావడం
Appease సంతృప్తిపరచు, ఉపశమింపజేయు
Appellant అప్పీలుదారు
Appellation పేరు, బిరుదు
Appetite ఆకలి, అన్నహితవు
Apple pie order ఠర్చిదిద్దడం, పకడ్బందీ ఏర్పాట్లు
Apple to discord వివాదస్పద అంశాలు
Applied science అనువర్తిత విజ్ఞానశాస్త్రం
Appraise విలువ అంచనా వేయడం
Appreciate మెచ్చుకొనడం
Apprise తెలియజేయడం

Approbate and reprobate అంగీకరించు, తిరస్కరించు
Approval ఆమోదం
Approver వాస్తవం చెప్పడానికి సిద్ధపడిన నేరస్థుడు, ప్రభుత్వసాక్షి
Approximate appraisal ఉజ్జాయింపు అంచనా
Apriori సంఘటన పూర్వాపరాలు
Aquarius కుంభరాశి
Aquatic జలచర
Arbitrage ఒక మార్కెట్టులోని సెక్యూరిటీలను కొని మరొక మార్కెట్లో ఎక్కువ ధరకు విక్రయించడం
Arbitral tribunal మధ్యవర్తిత్వ ట్రిబ్యునల్
Arbitration మధ్యవర్తిత్వం
Arbitrator మధ్యవర్తి
Arboculture వృక్షసంవర్ధనం
Arboriculture చెట్లు, కూరగాయల పెంపకం
Arcane గుప్త, రహస్య
Archealogy పురావస్తుశాస్త్రం
Archery విలువిద్య
Archipelago చిన్నదీవుల సమూహం
Archistoic era ప్రథమ జీవదశ
Architectural ensemble వాస్తుశిల్ప కళా ఖండాలు
Architectural expressions వాస్తుశిల్ప వ్యక్తీకరణలు
Architectural monuments వాస్తుశిల్ప నిర్మాణాలు
Arctic zone ఉత్తర ధ్రువం
Ardent adherence నిక్కచ్చిగా కట్టుబడి వుండడం
Ardous కష్టభరితమైన
Areecanut వక్క, పోక
Argus eyed అసూయతో చూడడం
Aries మేషరాశి
Arithmetic అంకగణిత శాస్త్రం
Arithmetic mean అంక మాధ్యమము
Arm-pit చంక
Armchair politician పడకకుర్చీ రాజకీయవేత్త, పట్టికబుర్లు చెప్పే రాజకీయవేత్త
Armed uprising సాయుధ తిరుగుబాటు
Armour కవచం
Arms race ఆయుధ పోటీ
Armstic యుద్ధవిరమణ సంధి
Army worm పచ్చపురుగు
Aromatic సుగంధ పరిమళాలు
Arraignment నిందారోపణ
Arrant పూర్తిగా
Arrears బకాయిలు
Arrogating లేనివి వున్నట్లుగా ఆపాదించుకోవటం
Arsenic పాషాణం
Arson దహనకాండ
Artery ధమని
Arthritis కీళ్లవాపు
Arthropoda ఎముకలు
Artifacts ప్రాచీన వస్తువులు
Artificial insemination కృత్రిమ గర్భోత్పత్తి
Artisans చేతివృత్తిదారులు
Artist కళాకారుడు
Artiste నటుడు
Artistic కళాత్మక
Artistic ability కళాత్మక శక్తిసామర్థ్యం
Artistic imagery కళాత్మక భావచిత్రాలు
As a matter of fact నిజానికి
As a rule విధిగా
As it were అలాగా అన్నట్టు
As one whole ఏకాండముగా, మొత్తముగా
As soon as possible సాధ్యమయినంత త్వరలో
As such అందుచేత, అలా ఉండడంచేత
Asafoetida ఇంగువ
Ascending order ఆరోహణక్రమం
Ascent ఆరోహణ
Ashkenazi జర్మనీ తూర్పు యూరప్ యూదులు
Asking price విక్రయ ధర
Asp కట్లపాము
Asperity కఠినవైఖరి
Aspersion దుష్ప్రచారం
Aspirations ఆకాంక్షలు, ఆశయాలు
Assembly adjourned sine die అసెంబ్లీ నిరవధికంగా వాయిదా పడడం
Assent అంగీకారం
Asseverate స్పష్టంగా, చిత్తశుద్ధితో ప్రకటించడం
Assert కచ్చితంగా చెప్పడం, నొక్కిచెప్పడం

Assets and liabilities ఆస్తులు, అప్పులు
Assiduously పట్టుదలతో
Associate member సహసభ్యుడు
Association సంస్థ, సంఘం
Asthama ఉబ్బసం
Astronaut రోదసీ యాత్రికుడు
Astronomical figures లెక్కపెట్టలేని అంకెలు
Astronomy ఖగోళ శాస్త్రం
Astrophysics ఖగోళ భౌతికశాస్త్రం
Astute నిశితమైన, తెలివితేటలుగల
Asylum ఆశ్రయం
At daggers drawn కయ్యానికి కాలుదువ్వడం
At logger heads శత్రువైఖరి
At one's wits; end ఏమీ పాలుపోకపోవడం, ఏమి చేయాలో తోచకపోవడం
At par అదే విలువతో, అదే రేటుకు
At stake ముప్పు, ప్రమాదం
At the helm of ఉన్నత స్థానంలో, సారథ్యం వహిస్తూ
At times తరచుగా, అప్పుడప్పుడు
Atelier స్టూడియో
Atheist నాస్తికుడు
Atlas ప్రపంచపటం
Atmospheric pressure వాతావరణ పీడనం
Atom పరమాణువు
Atonement ప్రాయశ్చిత్తం
Attritions క్షీణించిపోవడం
Atrocities అత్యాచారాలు, దమనకాండ
Attachment జప్తు
Attachment order జప్తు ఆదేశం
Attentuate బలహీనపడడం, పరిమాణం తగ్గడం
Atypical అస్తవ్యస్తమైన
Au revoir వీడ్కోలు, సయొనారా, ఫిర్ మిలేంగే
Auction వేలం
Auctioner వేలంవేసే వ్యక్తి
Audacity ధైర్యం, సాహసం, సిగ్గుమాలినతనం
Audimeter ధ్వనుల్లోని వ్యత్యాసాన్ని కొలిచే సాధనం
Aunt అత్త, పినతల్లి, మేనత్త
Aurora australis దక్షిణధ్రువ ప్రాంతంలో
Austerity measures పొదుపు చర్యలు
Autocracy రాచరిక వ్యవస్థ
Automatic dependence దాసంతటదే ఆధారపడడం
Automation స్వయంచాలిత
Automation of products on process ఉత్పాదకత క్రమాల స్వయంచలనీకరణ
Autopsy శవపరీక్ష
Autumn ఆకురాలు కాలం
Avalanche హిమపాతం
Aver స్పష్టంగా, విస్పష్టంగా ప్రకటించడం
Average cost సగటు వ్యయం
Average yield సగటు దిగుబడి
Averse వ్యతిరేకం, అయిష్టత, విముఖత
Avocation వ్యాపకం
Award అవార్డు, తీర్పు, బిరుదు
Axe గొడ్డలి, వేటు
Axes to grind స్వార్థప్రయోజనాల కోసం
Axiomatic స్పష్టమైన, రుజువు అవసరం లేని

# B

Back biter చాడీకోరు
Back in harness తిరిగి పనిలో చేరడం
Back lash ప్రతీకార దాడులు, హింస తిరిగి ప్రజ్వరిల్లడం
Back log శేషం
Back-out-of వెనక్కు తగ్గడం, చెప్పింది చేయక పోవడం
Back strack చెప్పింది చేయక పోవడం, వాగ్దాన భంగం
Back drop నేపథ్యం
Back hander లంచం
Backstair influence రహస్య పలుకుబడి
Backup తోడ్పాటు, చేయూత, సహాయం
Backwardation కొనుగోలుదారునికి షేర్లపంపిణీని వాయిదా వేసినందుకు విక్రేత చెల్లించే పెనాల్టీ
Backwater ఉప్పుటేరు
Bacterial Blight ఆకు ఎండు తెగులు
Bactericide బాక్టీరియా క్రిమి సంహారిణి

Bacteriology బాక్టీరియా అధ్యయనం
Bacterological warfare సూక్ష్మక్రిమి యుద్ధం
Bactriological weapons విషక్రిమి ఆయుధాలు
Bad debt వసూలుకాని బాకీ
Badger ఏడిపించడం, ఆటలు పట్టించడం
Bailabie offence జామీను ఇవ్వదగిన నేరం
Bailiff అమీను (కోర్టు)
Baking soda సోడియం హైడ్రోజన్ కార్బోనేట్ (వంటసోడా ఉప్పు)
Balance of fear భయ సమతూకం
Balance of forces బలాబలాల సమతూకం
Balance of payments విదేశీ చెల్లింపుల సమతూకం, తారతమ్యం
Balanced diet సమతులిత ఆహారం, సంతులిత ఆహారం, సమీకృతాహారం
Back- breaking కఠినమైన, శ్రమతోకూడిన, నడుములు విరిగేటట్టు
Ball and socket joint బంతిగిన్నె కీలు
Ballistic missile ఉపరితలంనుంచి మరొక ఉపరి తలానికి ప్రయోగించే క్షిపణి
Balm నొప్పి నివారిణి
Bamboo tree వెదురుచెట్టు
Banal మామూలు, సర్వసాధారణమైన
Banana అరటిపండు
Banking ombudsman ఫిర్యాదులు దర్యాప్తు చేసే బ్యాంకు అధికారి
Bankruptsy దివాలా
Banyan tree మర్రిచెట్టు
Barbadoes leg బోదకాలు
Barbaric పాశవిక
Barditurates నిద్రమాత్రలు
Bare essence అంతస్సారం
Bargaining power బేరమాడే శక్తి
Bark బెరడు
Barn ధాన్యపు కొట్టు
Barren money వడ్డీలేని రుణం
Barren land బంజరుభూమి, ఊసరక్షేత్రం
Barter system వస్తుమార్పిడి పద్ధతి
Base period ఆధారకాలం
Base year ప్రాతిపదిక సంవత్సరం
Baseless allegation నిరాధారమైన ఆరోపణ
Basic concept మౌలిక భావన
Basic differences మౌలిక వ్యత్యాసాలు, మౌలిక విభేదాలు
Basic means మౌలిక సాధనాలు
Basic orientation మౌలిక గమ్యం
Basic question మౌలిక ప్రశ్న
Basket of currencies ఒకే యూనిట్ కింద పరిగణించే కరెన్సీల సముదాయంలో మరో కరెన్సీ విలువను అంచనా వేయడం
Bastion దుర్గం
Baudy house వ్యభిచార గృహం
BCG (Bacillus Calmette Guerin) క్షయ వ్యాధి టీకాలు
Beans చిక్కుడు
Bear సెక్యూరిటీల ధరలు పెరగకుండా చేసి లాభానికి అమ్ముకునే వ్యక్తి
Bear away గెల్చుకోవడం
Bear the brunt ప్రధాన తాకిడిని తట్టుకోవడం
Bear up సహనం వహించడం
Bear out ధ్రువీకరించడం, తేటతెల్లం కావడం
Bears sway పరిపాలించడం, అధికృత వహించడం
Beat around the bush డొంకతిరుగుడు
Beat guard బీటు చౌకీదారు
Beat the air నిరుపయోగమైన కృషి
Beatle కుమ్మరి పురుగు
Bed and breakfast deal పన్నుల సౌలభ్యం కోసం షేర్లుకొని మర్నాడే అమ్మే పద్ధతి
Bed bug నల్లి
Bed of a garden తోట మడి
Bed wetting నిద్రలో మూత్రం పోయడం
Bedlam గందరగోళం
Bedrock మూలస్తంభం, పట్టుకొమ్మ
Beg to state మనవి చేసుకొను
Begin with (to) మొదటి విషయం
Beguile ఆకట్టుకొను, మోసగించు, కాలక్షేపం చేయు
Behests ఆదేశాలు
Behind the bars జైల్లో, కారాగారంలో
Belching ఎక్కిళ్ళు, త్రేన్పులు
Beleaguered ముట్టడికి లోనుకావడం
Believers మతావలంబకులు

Belittle తక్కువచేసిచూపడం, హీనపరచడం, చిన్న బుచ్చడం
Belligerent యుద్ధంలో పాల్గొన్న, కయ్యానికి కాలు దువ్వే
Bellows కొలిమి తిత్తి
Belony చెత్త, వ్యర్థం
Below poverty line దారిద్ర్యరేఖకు దిగువగా
Bench న్యాయపీఠం, బల్ల
Benefit of doubt నేరం రుజువుకాక నేరస్తుడిని వదలివేయడం
Benevolent mutuality సుహృద్భావయుత పరస్పరత
Bengal gram సెనగలు
Benagn tumor అపాయంలేని కణితి
Benumbed తిమ్మిరెక్కుట
Benzoin సాంబ్రాణి
Bequeath సంక్రమించిన, వారసత్వం
Berate గట్టిగా తిట్టడం
Beri beri వంజువ్యాధి, బి విటమిన్ లోపం
Bertillon system శరీరాకృతిని లేక అవయవాల వివరాలననుసరించి నేరస్థుని గుర్తించడం
Beset వేధించడం, చుట్టుముట్టడం, కష్టాలు
Besied పక్కన
Besides అదనంగా
Bespoke సూచన, తెలియజేయడం
Best approach అత్యుత్తమ వైఖరి
Best minds అత్యుత్తమ మేధావులు
Best people విజ్ఞులు, ఉత్తములు
Bestial క్రూర, పాశవిక
Bestow a title బిరుదు ప్రదానం
Bete noire అయిష్టమైన, నచ్చని
Betary one's own ignorance తన తెలివి తక్కువతనాన్ని బయటపెట్టుకోవడం
Better economic performance ఆర్థిక రంగంలో మరింత మేలైన కృషి
Between you me and the door post చాలా రహస్యంగా ఉంచడం
Bewilder కంగారుపడడం, విస్మయంచెందడం
Beyond doubt సందేహాతీతమైన
Beyond reach అందుబాటులోలేని
Beyond territorial water ప్రాదేశిక జలాలకు అవల
Bias పాక్షికత, పక్షపాతం
Bicameral ఉభయసభలు
Bicameralism ఉభయసభాపద్ధతి
Bidder వేలంపాటదారు
Bide one's time సహనంతో ఎదురుచూడడం
Biennial election ద్వైవార్షిక ఎన్నికలు
Bifurcation రెండుగా విభజించడం
Big bonanza అధికసంపద, అదృష్టం, మహాభాగ్యం
'Big bull' స్టాకు ఎక్స్చేంజిలో అధిక ధరలకు అమ్మే ఉద్దేశంతో పెద్ద ఎత్తున సెక్యూరిటీలు కొనే వ్యక్తి
Big gun బడా రాజకీయ లేదా వాణిజ్యవేత్త, పలుకుబడి, అధికారంగల వ్యక్తి
Big leap పెద్దగంతు, మహోల్లంఘన
Big stic policy క్రూరపెత్తన విధానం
Big-bang theory మహా విస్ఫోటక సిద్ధాంతం
Bigboard న్యూయార్క్ స్టాక్ ఎక్స్చేంజి
Bigot మతోన్మాదం
Bigotmy మత దురభిమానం
Bilateral ద్విపక్ష
Bile duct పైత్యరస నాళం
Bilingual policy ఉభయభాషా విధానం
Bill of exchange బ్యాంకు హుండీలు, వినిమయ పత్రం
Billingsgate అసభ్యంగా తిట్టడం
Bimonthly రెండునెలలకోసారి, ద్వైమాస
Bio chemistry జీవరసాయన శాస్త్రం
Biological factors జీవశాస్త్ర సంబంధమైన అంశాలు
Biology జీవశాస్త్రం
Biometry గణిత, గణాంక పద్ధతులద్వారా జీవశాస్త్ర అధ్యయనం
Biophysics భౌతిక శాస్త్రంద్వారా జీవశాస్త్ర అధ్యయనం
Biopsy రోగ నిర్ధారణకు శరీరంలోని కొంతభాగాన్ని పరీక్షించడం
Biosphere జీవమండలం
Bipartisan ఉభయపక్ష, రెండు పక్షాలకు చెందిన
Birds of a feather ఒకేరకమైన
Birds' eye view విహంగదృష్టి
Birth marks పుట్టుమచ్చలు

Bitter pill చేదుమాత్ర, ఆశించని చెడు పరిమాణం
Bitter gourd కాకర
Bizzare నమ్మశక్యంగాని, విచిత్రమైన
Black death ప్లేగు వ్యాధి
Black gram మినప్పప్పు
Black hairy caterpillar నల్లగొంగళి పురుగు
Black list బ్లాక్ లిస్టు, నిందార్హుల జాబితా
Black pepper మిరియాలు
Black rust నల్ల కుంకుమ తెగులు
Black shank కొండ ముల్లు రోగం
Black hole కృష్ణబిలం
Blackleg సమ్మెలోనైతం పనిచేసే కార్మికుడు
Blacksmith కమ్మరి
Black snut కాటుకతెగులు
Bladder మూత్రకోశం
Blain blister బొబ్బ, చీముపొక్కు
Bland diet సాత్వికాహారం
Blashphemy దైవదూషణ
Blazing lies పచ్చి అబద్ధాలు, దగా
Blazing a trial పథ నిర్దేశన
Bleaching powder చలువచేసే పొడి
Bleak నిరాశాజనకమైన
Blighted నశించడం, వడలిపోవడం, ధ్వంసం కావడం
Blind ally నిరాశావహం, ప్రతిష్టంభన, మూసుకు పోయిన దోవ
Blister beetle గుర్రపుమూతి పురుగు
Blithe ఉల్లాసం
Blizzard తీవ్రమైన మంచుతుఫాను
Bloated ఉబ్బిన
Bloated rice మరమరాలు
Blockhead చవట, అసమర్థుడు
Bloodless coup రక్తపాతరహిత తిరుగుబాటు
Blood feud జ్ఞాతివైరం
Blood pressure రక్తపుపోటు
Blood rerlationship రక్తసంబంధం
Bloodless revolution రక్తపాతరహిత విప్లవం
Blot out చెరిపివేయడం
Blow down పడదోయడం, పడిపోవడం
Blow one's own trumpet సొంతడబ్బా కొట్టుకోవడం, స్వోత్కర్ష
Blow out ఆర్పివేయడం
Blow the whistle చరమగీతం పాడడం, స్వస్తి చెప్పడం
Blowing hot and cold కోపతాపాలు
Blue beetle నీలబిళ్ల పురుగు
Blue chip అత్యంత శ్రేష్టమైన పారిశ్రామిక సెక్యూరిటీ, మంచి కంపెనీకి చెందిన రిస్కు లేని స్టాక్
Blue eyed boy అభిమాన పాత్రుడు
Blue moon అరుదైన, నూటికి కోటికి
Blurb అధికవర్ణన
Blurred vision అస్పష్టంగా, అలుక్కుపోయినట్లు కనబడడం
Boa కొండచిలువ
Boar మగపంది
Board of trustees ధర్మకర్తల సమితి
Bode ముందుగా ఊహించడం
Bodies సంస్థలు
Body politic రాజ్యం, సమష్టి పౌరవ్యవస్థ
Bog down జాప్యం, ప్రగతిలేకపోవడం
Boggling వేధించే
Bogus document బూటకపు పత్రం
Boiled rice ఉప్పుడు బియ్యం
Boistrous అల్లరి, చిలిపి, గందరగోళం, హడావుడి
Bold steps గట్టిచర్యలు, సాహసోపేతమైన చర్యలు
Bolster మద్దతు పెంపొందించడం
Bolt from the blue అశనిపాతం, అనూహ్య సంఘటన
Bombastic language శబ్దాడంబర భాష
Bonafide నిజమైన, అసలైన, యదార్థమైన
Bonanza గొప్ప సంపద, చాలా లాభసాటి వ్యాపారం
Bonded labour వెట్టిచాకిరీ
Bone of contention వివాదస్పద అంశం
Bonum valans యజమానిలేని ఆస్తి
Bony fish ఎముక చేపలు
Book adjustment ఖాతా సర్దుబాటు
Book value దాఖలా అయిన ఆస్తి విలువ
Boom హరాత్ సమృద్ధి
Boom period సమృద్ధికాలం, అమిత లాభాల కాలం
Boomerang ఎదురుతిరగడం

Bootlegging దొంగసారా అక్రమ రవాణా
Border conflict సరిహద్దు ఘర్షణ
Borse జర్మన్ స్టాక్ ఎక్స్చేంజి
Borstal school బాలనేరస్థుల పాఠశాలమిటి
Bottlegourd ఆనపకాయ
Bottlenecks అవరోధాలు, అడ్డంకులు
Bottom line అభిమతం, కీలకమైన అంశాలు, అంతిమలాభం
Bottom price అట్టడుగు ధర
Boundary mark సరిహద్దు గుర్తు
Bounden duty విద్యుక్త ధర్మం
Bourgeois law బూర్జువా న్యాయశాస్త్రం
Bourgeois nationalism బూర్జువా జాతీయ వాదం
Bourses స్టాక్ ఎక్స్చేంజీలు (యూరప్)
Bycott బహిష్కరణ, బహిష్కరించు
Bradycardin గుండె చాలా నెమ్మదిగా కొట్టుకోవడం
Braggadocio ఊరికే పట్టిగొప్పలు చెప్పుకోవడం
Brain child రూపొందించిన పథకం
Brain concussion దెబ్బమూలంగా మెదడు అదరడం
Brain drain మేధావుల వలస
Branch శాఖ
Brass smith కంచరి
Bravdo ధైర్యం వటించడం
Brawl కొట్లాడటం
Barzan age ద్వాపరయుగం
Braze రెండు లోహాలను అతకడం
Brazen Brigandage బాహాటమైన బందిపోటు చర్యలు
Breach of contract కరారునామా ఉల్లంఘన, కాంట్రాక్టు ఉల్లంఘన
Breach of law శాసన అతిక్రమణ, శాసన ఉల్లంఘన
Breach of privilege ప్రత్యేకహక్కుల భంగం
Breadth of vision విశాల దృక్పథం
Breadwinner సంపాదనాపరుడు
Break down విఫలం కావడం, శృంగిపోవడం
Break in, into చొరబడటం
Break off రద్దుకావడం, తెగతెంపులు
Break out పారిపోవడం, వ్యాపించడం, ప్రబలడం, సంభవించడం
Break up ముక్కచెక్కలు కావడం, ముగింపు
Breakneck speed విపరీతమైన వేగం
Breakthrough ముందడుగు
Brettonwoods agreement అంతర్జాతీయ ద్రవ్యనిధి, ప్రపంచ బ్యాంకు కరెన్సీల మారకం రేటుకి సంబంధించిన 1944 సంIIపు ఒప్పందం
Brevity క్లుప్తత
Brew మద్యం, మద్యం తయారీ
Bribery లంచగొండితనం
Bricks and mortar కంపెనీ తాలూకు సిఫారుసులు (దాని భవనాలు)
Bride పెళ్లికుమార్తె, వధువు
Bridegroom పెళ్ళికుమారుడు, వరుడు
Bridge finance తాత్కాలిక అవసరాలను తీర్చే రుణాలు
Bridge head సేతుదుర్గం
Bridge of understanding అవగాహనా వారధి
Bring about సంభవింపజేయడం
Bring fourth దారితీయడం
Bring in ఆర్జించిపెట్టడం, సంపాదించిపెట్టడం
Bring out వెల్లడించడం, బైటపెట్టడం, ప్రచురించడం
Bring round ఎదుటివ్యక్తి అభిప్రాయాన్ని మార్చగలగడం
Bring up పెంచి పెద్దచేయడం
Brinjal వంకాయ
Brink of war యుద్ధసూపం అంచున
Broad participation విస్తృత భాగస్వామ్యం
Broad political outlook విశాల రాజకీయ దృక్పథం
Broad public విస్తృత ప్రజానీకం
Broader course విస్తృత పంథా
Broker దళారి
Broker a peace plan శాంతిపథకానికి మధ్యవర్తిత్వం వహించడం
Brokerage బ్రోకరు కమీషను
Bromide paper సిల్వర్ బ్రోమైడ్ ఉన్న ఫోటోగ్రఫీ కాగితం
Bronchitis శ్వాసకోశవ్యాధి
Bronze (medal) కంచు (కాంస్య పతకము)

Brooch పమిట పిన్ను
Brood గట్టిగా ఆలోచించడం
Brook, no delay జాప్యం తగదు, ఆలస్యం చేయకుండా వుండటం
Broom చీపురు
Bruise కముకుదెబ్బ, గీరుకోవడం
Bruchid ముక్కుపురుగు
Budworm మొగ్గపురుగు
Buffer state రెండుదేశాలమధ్య ఉండే స్వతంత్ర దేశం
Bugging రహస్యంగా సంభాషణలు వినడం, గూఢచర్యం
Bugle బాకా
Bulb దుంప
Bulk హెచ్చు పరిమాణం, రాశి, అధికమొత్తం
Bulldog bond బ్రిటన్‌కు చెందని కంపెనీ బ్రిటిష్ మార్కెట్లో స్టెర్లింగ్‌లో జారీచేసే బాండ్
Bullion rates బంగారం, వెండి టోకుధరలు
Bulward కంచుకోట, దుర్గం
Bumper crop ఏపుగా ఎదిగిన పంట, పుష్కలంగా పండిన పంట
Bund జర్మన్ ప్రభుత్వబాండ్
Bungling అవకతవకలు, చెడగొట్టడం, కంగాళీ చేయడం
Bureaucratic attitude నిరంకుశాధికార వర్గ వైఖరి
Burgeon వికసించడం, విస్తరించడం
Burn a hole in the pocket వృధాగా ఖర్చుపెట్టడం
Burn one's fingers తప్పుడు అంచనాలతో నష్టపోవడం, చేయి కాల్చుకోవడం
Burn the bridges behind ఏరుదాటి తెప్ప తగులబెట్టడం
Burn the candle at both ends ఏకకాలంలో పరస్పర విరుద్ధమైన పనులు చేయడం
Burning problem తీవ్రసమస్య, వేధిస్తున్న సమస్య
Burning question తీవ్రంగా వేధిస్తున్న ప్రశ్న, సమస్య
Bury the hatchet గతాన్ని విస్మరించి క్షమించడం, శత్రుత్వాన్ని విస్మరించడం
Business acumen వ్యాపార దక్షత
Business like వ్యవహార సరళి
Business transactions వ్యాపార లావాదేవీలు
Butcher కసాయి
Butterfly సీతాకోకచిలుక
Buy a pig in a poke బేరం ఆడకుండా కొనెయ్యడం
Buyoant mood ఉల్లాసపూరితమైన ధోరణి, ఆశావహమైన, ఆశాభరితమైన
By all means అన్నివిధాలా
By and by వెంటనే, కొద్దిక్షణాల్లో
By and large మొత్తంమీద
By any means ఏవిధంగా అయినాసరే
By election ఉప ఎన్నిక
By fits and starts కుదురు, నిలకడ లేకపోవడం
By mistake పొరపాటున
By pass పక్కదారి
By rotation వంతులవారీగా
By the by అన్నట్టు, సందర్భవశాత్తూ
Bye-laws సంస్థ ఆమోదించిన నిబంధనలు, నియమాలు
Bypass దాటవేయడం
Byproducts ఉపవస్తువులు, ఉప ఉత్పత్తులు



Cabage borer తలకొట్టు పురుగు
Cabaret dancer రెస్టారెంట్‌లో డాన్సు చేసే అమ్మాయి, కాబరే డాన్సర్, నర్తకి
Cabinet మంత్రివర్గం
Cabinet rank మంత్రివర్గ హోదా
Cabotage కోస్తా వ్యాపారం
Caco economy అవకతవకలతో కూడిన నిర్వహణ
Cacophony గందరగోళం
Cactus నాగజెముడు
Cadaver శవం
Caitiff బందీ, బానిస
Cairn రాళ్ళగుట్టలు

Carry about అట్టేపెట్టుకోవడం
Carry off గెల్చుకోవడం
Carry on కొనసాగించడం
Carry out (to) నిర్వర్తించడం, అమలుపరచడం
Carry over వాయిదాపడడం
Carta blanche సంపూర్ణ స్వతంత్రం, స్వేచ్ఛ, అనుమతి
Cartilage మెత్తని ఎముకలు, మృదులాస్థి
Cartographic aggrression ఇతరుల భూ భాగాలను తమవిగా దేశపటాల్లో చూపించడం
Case కేసు, పెట్టె
Case worm గొట్టాలపురుగు
Cash crops వాణిజ్యపంటలు
Cash transactions నగదు లావాదేవీలు
Cashewnut జీడిపప్పు
Cast a slur upon నిందవేయుడం
Castigate దుయ్యబట్టడం
Cast-iron పోతఇనుము
Caster oil ఆముదం నూనె
Castor senslіоoper దాసరి రేక నామాల పురుగు
Castorslug ఆకుపురుగు
Cat calls ఈలలు, కేకలు
Catalyst ప్రేరణ, ప్రేరకశక్తి
Catamaran తెప్ప, కట్టమరం
Cataract కంటిలో పొర, శుక్లం
Catchment area పరీవాహప్రాంతం
Categorically నిర్ద్వంద్వంగా
Category శ్రేణి
Cator pillar గొంగళిపురుగు
Cats' paw మరొకడి పనిముట్టుగా, మోసగించడం
Cats and dogs సెక్యూరిటీరంగంలో గ్యారంటీ లేని, నిరాశాజనకమైన సెక్యూరిటీల పేరు
Cattle feed పశువుల దాణా, మేత
Cattle pound బందెల దొడ్డి
Caucus ముఠాతత్వం
Caught napping ఆశించనివిధంగా దెబ్బతినడం, ఎదురుచూడని పరిణామం
Cause ఆశయం, కారణం
Cause and effect కార్యకారణ
Causeway అలుగు వంతెన, కట్ట
Caveat హెచ్చరిక
Cavil తప్పుచూపడం, అభ్యంతరాలు లేవదీయడం
Ceded districts దత్తమండలాలు
Ceder tree దేవదారు చెట్టు
Ceiling on holdings కమతాల గరిష్ఠ పరిమాణ నిర్ణయం
Ceiling price గరిష్ఠ పరిమిత ధర
Celerity వేగంగా, చురుకుగా కదలడం
Celestial poles ఖగోళ ధ్రువములు
Cemetary శ్మశానవాటిక
Censure అభిశంసించడం
Censure motion అభిశంసన తీర్మానం
Census జనాభా లెక్కలు
Centenary celebrations శత వార్షికోత్సవాలు
Centipede జెర్రి
Central agencies కేంద్ర సంస్థలు, ఏజెన్సీలు
Central Board of direct taxes ప్రత్యక్షపన్నుల కేంద్ర బోర్డు
Central nervous system కేంద్ర నాడీ మండలము
Centralised direction కేంద్రీకృత సారథ్యం
Centralised regulation of production కేంద్రీకృత ఉత్పత్తి నియంత్రణ పద్ధతి
Cerebellum చిన్న మెదడు
Cereberal haemorrhage మెదడులో రక్త నాళాలు చిట్లడం
Cerebrum పెద్ద మెదడు
Certain level ఒకానొక స్థాయిలో
Cess రుసుం, పన్ను
Cess pool మురికిగుంట
Chafe కోపంతో బుసలుకొట్టడం
Chafergrub beatle పెంకుపురుగు
Chaff చిట్టు
Chain reaction గొలుసుకట్టు పర్యవసానాలు
Chamber of commerce వాణిజ్యమండలి
Changing equilibrium మారుతున్న సమతౌల్యం
Chapping చర్మం చిట్లడం, పగలడం
Characterestic లక్షణభూతమైన, సర్వసాధారణమైన

